# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు

మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 59 సంచిక: 61
23-12-1988
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూపాయి


# నెల్లూరు నగర వీధులలో జనార్ధన రథం జైత్రయాత్ర!



ప్రదేశ్ కాంగ్రెస్ రథానికి సమర్థుడైన సారథి!

మా విలేఖరి

18 తేది రాత్రి పిసిసి నేత శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డికి నెల్లూరునగరం స్వాగతించిన తీరు అపూర్వము, అద్వితీయము. అధికారానికి వైఖరాలెత్తడం, అధికారంలో వున్న నాయకులను పూలపల్లకీలలో ఊరేగించి బ్రహ్మరథం పట్టడం నెల్లూరుకు కొత్తేమీకాదు. అయితే అవి అధికారంకోసం అర్రులుచాచేవారి వ్యక్తిగత ధనబల దర్ప ప్రదర్శనలుగా వుంటాయి. పెద్దనాయకుల ప్రాపుకోసం చిన్ననాయకులు పడేపాట్లుగా వుంటాయి. కానీ జనార్దనరెడ్డికి లభించిన అఖండస్వాగతం ఆకోవకు చెందినదికాదు. ఆయనిప్పుడు ఏ అధికార పదవిలోనూ లేరు; సమీప భవిష్యత్తులో గద్దెనెక్కుతారన్న ఆశ కూడాలేదు. అందువల్ల ఆయన మెప్పుకోసం ఎవరో చేతిచమురు వదలించుకుని దండలు సృష్టించడమూ కాదు.

18 తేది రాత్రి నెల్లూరులో మనం చూసింది నిజంగా ప్రజాప్రదర్శన. అపార ప్రజావెల్లువ; అధికారంలో లేని కాంగ్రెస్‌పార్టీపట్ల తమ ఇష్టాన్ని, మక్కువను వెల్లడించడానికి; రాష్ట్రంలో కాంగ్రెస్‌ను వెనక్కి పిలిపించాల్సిన అవసరాన్ని నొక్కిచెప్పడానికి; ఇప్పుడున్న ప్రభుత్వంపై తమ అభిశంసనను వ్యక్తం చేయడానికి ప్రజలు ఉత్సాహంతో పరవళ్ళు త్రొక్కుతూ, తమంత తాముగా, స్వచ్ఛందంగా వీధుల్లోకివచ్చి జరిపించిన మహాప్రదర్శన అది! దాన్ని ఒక నాయకుడికి వ్యక్తిగతంగా పట్టిన బ్రహ్మరథం అనడంకంటే, ఒక కొత్త పాలనావ్యవస్థ రూపకల్పనకు జనం పలికిన నాంది మహోత్సవంగా అభివర్ణించడం సమంజసం!

పిసిసి అధ్యక్షుడైన తర్వాత శ్రీ జనార్దనరెడ్డి తొలిసారిగా నెల్లూరు వచ్చిన సందర్భం ఇది. 17 తేది జిల్లా దక్షిణప్రాంతంలో అష్టను రు అశ్వమేధ యాత్ర జరిపినట్లు విజయఢంకాలమోగించి 18 తేది మధ్యాహ్నం 3 గంటలకు నెల్లూరు చేరారు. అయ్యప్పస్వామి దేవాలయం దగ్గరే ఆయనకు జిల్లా నాయకులందరూ ఎదురేగారు. అక్కడ్నుంచి అదొక జైత్రయాత్రే! టాపులేని జీపునెక్కిన జనార్దనరెడ్డికి ముందుగా రెండువందల ద్విచక్ర వాహనాలు కదిలాయి; పదులసంఖ్యలో కార్లు వెనుక అనుసరించాయి. వి.సి. స్టేడియం దగ్గరకొచ్చేసరికి వందకుమించిన ట్రాక్టర్లు, లారీలు బారులుతీరి వున్నాయి. అక్కడ నుండి కదిలింది జనార్దన రథయాత్ర.

జీపులో జనార్దనరెడ్డితోపాటు ద్రోణంరాజు, రోశయ్య, శ్యామలరావు వంటిరాష్ట్ర నాయకులు; ఆనం సంజీవరెడ్డి, జె.కె. రెడ్డి, కె.వి. సుబ్బారెడ్డి, చదలవాడ కృష్ణమూర్తి, అంకయ్యగౌడ్, పసల పెంచలయ్య, డాక్టర్ సుందరరామరెడ్డి వంటి జిల్లా ముఖ్యులు సర్దుకున్నారు. అంతమంది దాంట్లో ఎట్లా ఇరుక్కున్నారో అర్థమేకాదు. మధ్యలో పూలమాలలు వేయడానికి వచ్చే వారికి జానెడు జాగా ఇంకెక్కడా సందు దొరకలేదు.

ప్రదర్శన ముందుకు కదలివచ్చేకొద్దీ వందలు, వేలసంఖ్యలో జనం ఊరేగింపులో కలిశారు. దారిపొడుగునా జనార్దనరెడ్డిని పూలమాలలతో ముంచెత్తారు. వచ్చిన ప్రతి ఒక్కరూ జీపుదగ్గరకు పోవాలనే ప్రయత్నంలో త్రోసుకుంటూ ముందుకు రావడంతో జీపు కదలడమే కష్టమైపోయింది.

మద్రాసు బస్టాండుదగ్గరనుంచి వాహన్‌పేటమీదుగా పెద్దబజారు కొచ్చేసరికి జనాన్ని అదుపు చేయడం ఎవరితరమూకాలేదు. ముఖ్యంగా మహమ్మదీయులు ప్రతిఅంగడి ఎదుట జీపునాపి బుట్టలతో పూలు క్రుమ్మరించారు. ప్రదర్శన కదలిపోయినతర్వాత చూస్తే చిన్నబజారు కొసవరకు పూల తివాచి పరిచినట్లుండింది.

ట్రంకురోడ్డులోనూ అదే పరిస్థితి. రోడ్డుపక్క జనం మిద్దెలు మేడలు ఎక్కి

—తరువాత 7 వ పేజీలో

# ప్రజల్లో ఉత్సాహపు పరవళ్లు- నాయకుల్లో సమైక్యతపవనాలు!

"మాలో ఇప్పుడున్న సమైక్యత ఇట్నే కొనసాగితే 11 సీట్లు కాంగ్రెస్‌కు ఖాయం". ఆనం సంజీవరెడ్డి.

"జనార్ధనరెడ్డి అంటే ప్రేమతో కొందరు, భయంతో కొందరు దగ్గరచేరారు. ఆయన ఏదో ఒక మేజిక్ చేసి అందర్నీ చేరదీస్తాడు". కావలి యానాదిరెడ్డి.

"కాంగ్రెస్ వాదులేకాదు. తెలుగుదేశం మంత్రులుకూడా జనార్ధనరెడ్డి సాహసం, జనార్ధనరెడ్డి రక్షమార్గం అంటున్నారు". చదలవాడ కృష్ణమూర్తి.

"జనార్ధనరెడ్డి పి సి సి అధ్యక్షుడు కావడం నెల్లూరు జిల్లాచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన రోజు". కె. వి. సుబ్బారెడ్డి.

నిన్న మొన్నటివరకు జనార్ధనరెడ్డికి దూరదూరంగా మసలుతుండిన నాయకులందరూ మొన్నటి పర్యటనలో ఆయనకు దగ్గరకావడంతో జిల్లాకాంగ్రెస్‌లో వర్గాల ఎల్లలన్నీ చెరిగిపోయాయా అన్పించింది. జనార్ధనరెడ్డి పి సి సి అధ్యక్షుడైన తర్వాత ఒకరిద్దరు మినహా అందరూ ఆయనకు దగ్గర కావడానికి పోటీలు పడుతున్నారు. ఆనం సంజీవరెడ్డివంటివారు పూర్వమే జత అయినా. పి సి సి తర్వాత వారిద్దరి మధ్య స్నేహబంధం మరింత ముదురు పాకంలో పడిపోయినట్లుంది. అయితే సంజీవరెడ్డి స్నేహంలో కృతకత్వం కన్పించడంలేదు. ఎవర్నినమ్మితే వారివెంట ముక్కుసూటిగా పోవడం, పగలురాత్రివిడవకుండావుండడం ఆయన రాజకీయ తత్వం. ఈ సీజన్‌లో జనార్ధనరెడ్డితో జతకట్టారు; 1977

> ఇవి రెండూ ఇట్నే
> కొనసాగించగల్గితే
> జిల్లాలో కాంగ్రెస్‌కు
> ఎదురే వుండదు!

ముందునాటిపాత స్నేహపు పునరుద్ధరణగా వుంది మిత్రత్వం.

సంజీవరెడ్డిగారు వస్తూవస్తూ తనతోటి ఆత్మకూరు ఎమ్మెల్యే డాక్టర్ బి. సుందరరామిరెడ్డిగారినికూడా జనార్ధనరెడ్డికి సన్నిహితంగా తెచ్చినట్లున్నారు. నిజానికి సుందరరామిరెడ్డి అంతగా వివాదాస్పదుడైన వ్యక్తేమీకాదు; నలుగురితో నారాయణ అన్నట్లు దూరంగా మసలుతుండినాడు; నలుగురితో కలిసి ఇప్పుడు దగ్గరకు వచ్చేశాడు.

సంజీవరెడ్డి మంత్రం ఉదయగిరి రాజమోహనరెడ్డి దగ్గర పూర్తిగాపారినట్లులేదు. పిసిసి ప్రమాణ స్వీకారోత్సవానికి వచ్చినట్లుగా పిల్చినా, పెళ్ళికి పోయి కట్నపోయి పేరుకు వేసుకుని వచ్చేశారట. జనార్ధనరెడ్డికి వ్యతిరేకంగా సంజీవరెడ్డితో కలిసివుండగల్గాడుకాని, జనార్ధనరెడ్డికి అనుకూలంగా సంజీవరెడ్డితో కలిసి రాలేకపోయినట్లున్నాడాయన. ఆయనరాక పోక ఈ జిల్లా రాజకీయాలతో అనుబంధమై వుండేట్లులేదు!

ఏమాత్రం వింతా, విచిత్రమూ కాని కలయిక శ్రీ కె. వి. సుబ్బారెడ్డిది. జనార్ధనరెడ్డికి పి సి సి ఇవ్వకూడదనే లాబీతో కలిసి ఢిల్లీలో బసచేసిన సుబ్బారెడ్డిగారు. అక్కడే పిసిసి అధ్యక్షుడికి మొదటి పూలమాల వేసిన జిల్లా నాయకుడిగా గుర్తింపు పొంది వచ్చాడు. వెంటనే జనతా దా మార్చేసి భాయి భాయి అన్పించుకున్నాడు. సుబ్బారెడ్డిగారికంటే టౌన్‌లో ఆయన కౌన్సిలర్లు, బంధుబలగం జనార్ధనరెడ్డికి సన్నిహితంగా కన్పడడానికి తాపత్రయపడుతూంది. అయితే వీరి తపనలో కృత్రిమత్వమే జనానికి కొట్టొచ్చినట్లు కన్పడుతూంది!

కావలి యానాదిరెడ్డికూడా 18 తేది నెల్లూరు సభలో జనార్ధనరెడ్డి ప్రక్కన నిలబడి ప్రజలకు కనువిందుచేశారు. గడ్డం పట్టుకొని బ్రతిమలాడినా మద్రాసు వదలి రాని రెడ్డిగారిలో వచ్చిన ఈ కదలిక చాలా విశేషంగా చెప్పుకోదగినది!

పి సి సి నియామకానికి వారం రోజుల ముందు దొరవారిసత్రం ప్రజాసన్నిహిత యాత్రకు జనార్ధనరెడ్డి స్వయంగా ఆహ్వానం అందచేసినా తీరికలేదుపొమ్మన్న చదలవాడ కృష్ణమూర్తిగారు, జనార్ధనరెడ్డిని మద్రాసునుంచే స్వాగతించి, రెండురోజులు వెంటవుండే తీరికచేసుకున్నారు. నాయుడుపేటలో ఆయన పట్టిన బ్రహ్మరథం అంతింతదికాదు.

నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి తెలుగుదేశం వదలి రాకముందునుంచే, తాను కాంగ్రెసీయుడనని మరచి ఆయనకు స్వాగత సత్కారాలు చేస్తుండిన అంకయ్యగౌడ్ గారికి, పిసిసి రాగానే జనార్ధనరెడ్డికి పూలమాల వేసే ఛనువు చిక్కింది.

వెంకటగిరిలో రాఘవరెడ్డి వంటి పాత మిత్రులందరూ జనార్ధనరెడ్డిని పలకరించి పోయారు; వెన్నూరు నాయకులుకూడా కొందరు ఆయనతో చేతులు కలిపారు; తన రాజకీయ జీవితంలో నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి తప్ప ఇంకెవ్వరికి సాహచర్యం లేదన్నంత నిబ్బరంగావుంటుండిన కోడూరు శ్రీరంగారెడ్డిగారు ముందుకు పోవాల్నా, వెనక్కుమళ్ళాల్నా తెలియని సంశయాత్మతో, రోడ్డు దూరంగానిలబడి జీపుపై ఊరేగింపులోవున్న జనార్ధనరెడ్డికి రెండు చేతులెత్తి పెద్ద నమస్కారంపెట్టి మేమూ మీ ప్రక్కకొచ్చేందుకు సిద్ధమని ప్రకటించాడు. సామంతు రఘురామరెడ్డిగారూ నమస్కారంతోనే సరిపెట్టుకున్నారు. ఈ ఒక్క సెకండుపనికి పాపం వారిద్దరూ రెండుగంటలపైనే ఆర్ అండ్ బి అతిథి గృహంలో వేచివుండవలసివచ్చింది.

ఇట్లాచెప్పుకుంటూపోతే జిల్లాలోని ప్రతి కాంగ్రెసీయుడూ వర్గాలమాట మరచి, చేవ

—కొరవ 8వ పేజీలో

## పినాకిని తీరం

### "పెట్టె బేడ సర్దుకొని సిద్ధం కావచ్చు..."

"1988 ఎన్నికలముందు 'ఈనాడు' అనాదివారావరణాన్ని గూర్చివిరోజూరోజూ వస్తున్న మార్పును పాఠకుల కండ్లకు కట్టినట్లు అత్యద్భుతంగా, అత్యంత వ్రత్తైజకరంగా వివరిస్తూవచ్చింది. పోలింగుకు ఒకటి రెండురోజులముందు అనుకుంటాను. ఎం. ఎల్. ఎ క్వార్టర్సులోని కాంగ్రెస్ సభ్యులారా పెట్టెబేడ సర్దుకొని రూములు ఖాళీచేసి పోవడానికి సిద్ధంగా వుండండి!" అంటూ పతాకశీర్షికతో ప్రకటించింది. అంటే తెలుగుదేశం ఘంటాపథాయించి గెలువబోతున్నదని, కాంగ్రెస్ పరాజయం ఖాయమని ఆపత్రిక ముందేఘంటాపథంగా చెప్పిందన్నమాట. ఈసారి ఎన్నికలలో ఆవేమాటలు అవే హెచ్చరికలు తెలుగుదేశానికి తిప్పికొట్టదగిన పరిస్థితులు కనుపించడంలేదంటారా? మార్పుగోచరం కావడంలేదంటారా? మీ అభిప్రాయమేమి?".

ఒక రాజకీయ మిత్రుడు నన్ను పైవిధంగా ప్రశ్నించాడు. పెట్టెబేడసర్దుకొమని తెలుగుదేశం శాసనసభ్యులను ఇప్పుడె హెచ్చరించడం తొందరపాటవుతుంది ఇంకా సంవత్సరం వ్యవధివుంది; 1989 డిసెంబరులో అయితే ఏ అభిప్రాయమైనా కొంతవరకు ఖచ్చితంగా చెప్పవచ్చు. వాగ్రూపంగా ఏమిమాట్లాడినా, ఎన్ని వూహాగానాలుచేసినా ఇబ్బంది లేదుగాని, అచ్చులోవచ్చే ప్రతిఅక్షరానికిపత్రికలవాళ్లు పాఠకులకు జవాబుచెప్పుకోవాలి; వ్రాసింది జరిగితే అంత ముందుగా ఎట్లా వూహించగలిగాడు అని సంతోషంతో ఆశ్చర్యం వ్యక్తం చేస్తారు; జెడిసిందా ముక్కుపిండేస్తారు! పైగా ఎన్నికలలో ఫలితాన్ని ఇదమిద్ధంగా చెప్పగలిగిన వాతావరణం పోలింగుకు ఒక వారం ముందుగానీ తెలియదు. రెండు మూడు రోజుల ముందు కూడా అంచనాలు తల్లక్రిందులుగా మారి పోయినసందర్భాలువున్నాయి. అందువల్ల ఎన్నికఫలితాల వూహాగానాలను వాళ్లదగ్గర పెట్టుకునేచేయాలి. కాబట్టి పైమిత్రుని ప్రశ్నకు ఇప్పుడే సమాధానం చెప్పడానికి నేను సాహసించలేను.

కాని ప్రజల్లో మార్పు వుంది; కొట్టవచ్చినంత మార్పు వుంది. ఈ మార్పు చివరివరకు కొనసాగితే ఫలితాన్ని ఇప్పుడే వూహించడం కష్టంకాదు. ప్రజాభిప్రాయం ఏ పార్టీకైనా అనుకూలంగాగాని, ప్రతికూలంగాగాని మారడానికి మధ్యలో ఎన్నో సంఘటనలు సన్నివేశాలు కారణమవుతుంటాయి. దక్షిణ భారతంలో రక్షణం కన పడుతున్న అటువంటి కారణాల్లో జనవరి 21 తేది జరగబోతున్న తమిళనాడు ఎన్నిక ఫలితాలు ఒకటి. ఆ ఎన్నికలో కాంగ్రెస్ విజయం సాధించగలిగిందా, కనీసం ఇంకొకరి సహకారంతోనైనా ప్రభుత్వాన్ని ఏర్పరచగలిగిందా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్‌దేనని ఈనాడే వ్రాసిపెట్టుకోవచ్చు. తమిళప్రజల ధోరణికి, ఆంధ్రుల ఆలోచనారీతికి సామ్యం వున్నదనికాదు; తమిళనాడులో కాంగ్రెస్ అధికారంలోలేని పదిహేనుసంవత్సరాలు ఆంధ్రలో కాంగ్రెస్ పరిపాలన నిరాఘాటంగా సాగింది గదా! కాని కరడుగట్టిన ద్రవిడతత్వంగల తమిళనాడులోనే కాంగ్రెస్‌కు అనుకూలమైన మార్పువస్తే చైతన్యవంతమైన ఆంధ్రలో పూర్తి మార్పువుండితీరాలి. రాజకీయాల సామాన్య విశ్లేషణ పర్యవసానంగా ఏర్పడుతున్న అభిప్రాయం ఇది!

ఆంధ్రలో మార్పు సంవత్సరంక్రితమే ప్రారంభమైంది; ప్రధాని రాజీవ్ గాంధీ నెల్లూరుకు విచ్చేసినపుడు నేం ఈనినట్లు, పుట్ట పిగిలినట్లు పొర్లబడి వచ్చిన జనసమూహమే అందుకు నిదర్శనం. సంవత్సరంతర్వాత మొన్న 16 తేది కొత్త ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి నెల్లూరు తొలిరాకసందర్భంలో ఏర్పాటైనసభకు మాజీమంత్రి శ్రీ రోశయ్య గారన్నట్లు- కుంభవృష్టిలోకూడా చలించకుండావున్న ఇన్నివేలమంది ప్రజలనుచూస్తే ముఖ్యమంత్రి రామారావుగారి మాటలలో అయితే ఆహా సముద్రముపొంగినదా, ఆకసము చిల్లిపడినదా- అన్నట్లుగా వుండిన అపూర్వదృశ్యము- కాంగ్రెస్ అనుకూ

—కొరవ 8 వ పేజీలో

# జమీన్‌రైతు

## ఎన్నికల సంస్కరణలు

ప్రభుత్వం తలపెట్టిన రాజ్యాంగ సవరణ, ఎన్నికల సంస్కరణల బిల్లులను పార్లమెంటు వుభయసభలు ఆమోదించాయి. శాసనసభల సమ్మతి కావాలి కాబట్టి అవి అమలులోకి రావడానికి మరికొంత కాలం పడుతుంది. ఎలక్షన్ కమిషన్ సిఫారసులు పదహారింటిలో పదమూడింటిని ఈ బిల్లులలో పొందుపరచామని చెప్తూ, ఇవి చరిత్రాత్మకమైన సవరణలని ప్రధాని, న్యాయశాఖామంత్రి అభివర్ణించారు.

ప్రధాని చెప్పినట్లు ఓటింగు వయసుకు సంబంధించిన ఈ 62 వ రాజ్యాంగసవరణ చరిత్రాత్మకమైనదే. వయోజన ఓటింగు హక్కును కల్గించడమే ఒక విప్లవాత్మకమైనమార్పు. అటువంటిది ఓటింగు వయస్సును ఇరవై ఒకటి నుండి పద్దెనిమిదేళ్ళకు తగ్గిస్తూ భారత రాజ్యాంగం అమలుకువచ్చిన ముప్పయ్‌ఆరేళ్ళ తర్వాత సవరణ తేవడం చరిత్రాత్మకమే అవుతుంది. అప్పటికీర్తి తాత నెహ్రూదైతే, ఇప్పటిమార్పు మనుమడు రాజీవ్‌గాంధీది. అధికార ప్రతిపక్షాలు అరమరికలు లేకుండా ఈ రాజ్యాంగ సవరణను ఏకగ్రీవంగా ఆమోదించ్టడంకూడా- ఈనాటిపరిస్థితుల్లో- చరిత్రాత్మకమే!

మొన్నజరిగిన ఇతర సవరణలన్నీ ప్రజాప్రాతినిధ్యచట్టానికి సంబంధించినవే. ఈ సవరణలకు ప్రతిపక్షాలు మరెన్నోసవరణలు ప్రతిపాదించాయి; కాని ప్రభుత్వం ప్రతిపక్ష సవరణలు కొన్నింటిలో ఏకీభవించినా, ప్రస్తుతానికి అంగీకరించలేనని త్రోసివేసింది. ఓటింగు వయస్సును పద్దెనిమిదేళ్ళకు తగ్గించినందువల్ల దేశంలో ఐదుకోట్లమంది కొత్తగా ఓటర్లవుతారు. పద్దెనిమిదేళ్ళకే ఓటరు కావడమనేది మహారాష్ట్రానికి కొత్తేమీకాదు; పంచాయతీసంస్థల ఎన్నికలు ఆ ప్రాతిపదికమీదనే జరిగాయి. ఓటింగు వయోపరిమితి తగ్గించినందువల్ల తమ ప్రతినిధులను ఎంచుకోవడంలో బహుళసంఖ్యాక ప్రజల అభిప్రాయం ప్రతిబింబిస్తుంది. కాని దీనివల్ల విలువతెలిసి, యోచించి, అర్హతనుగుర్తించి ఓటుచేయలేని వారిసంఖ్యకూడా పెరగదా అనే సందేహం కలగకపోవడంలేదు. విద్యావంతుల శాతం ఎక్కువై, స్వంత ఆలోచన స్వంతనిర్ణయంమీద ఓటు చేయగలిగిన పరిణతి మన ఓటర్లలో కలిగినప్పుడే వయోపరిమితి తగ్గింపు సార్థకమవుతుంది. ప్రస్తుతానికి ఓటర్లు 'గాలి' కి కొట్టుకొనిపోయే స్థితిలోనే వున్నారనే వాస్తవాన్ని విస్మరించలేము. ఆ విషయం అటుంచి, ఓటింగు వయస్సుతోబాటు పార్లమెంటు, శాసనసభలకు పోటీ చేసే అభ్యర్థుల వయస్సునుకూడా తగ్గించివుంటే సముచితంగా వుండేది.

అభ్యర్థుల అనర్హతల జాబితాలో కొత్త అంశాలు అనేకం చేర్చబడ్డాయి. అట్లనే ఎన్నికనేరాలకు శిక్షకూడా కఠినతరంచేస్తూ సవరణలు తేబడినాయి. వుగ్రవాదులు, ఆర్థికసంబంధమైన నేరాలు, స్మగ్లింగు, దొంగనిల్వలు, అధికలాభాలు, ఆహారపదార్థాలు- మందులలో కల్తీలు, స్త్రీలవేధింపు... వీటిలో దోషులైనవారు ఎన్నికలలో పోటీచేయడానికి అనర్హులవుతారు. బ్యాలెట్ పెట్టెలు ఎత్తుకెళ్ళడం, దొంగఓట్లు వేయడం వంటి నేరాలకు శిక్షలు ఎక్కువచేయబడినాయి. రాజకీయ పార్టీగా రిజిస్ట్రేషన్‌కు కొన్ని అర్హతలు నిర్ణయింపబడ్డాయి; ఆ విషయంలో ఎలక్షన్ కమీషన్‌కు విశేషాధికారం ఇవ్వబడింది. ఈ రోజులలో సోషలిజం- సెక్యులరిజం- డెమొక్రసి పేరు చెప్పుకోని పార్టీలేదు. మతతత్వం, దేశసమగ్రతకు విఘాతం కల్గించే పార్టీలకు గుర్తింపు ఇవ్వకుండడం అవసరమేకాని; ఆ నిబంధనలు దుర్వినియోగం కాకుండావుంటాయా అనేదే సమస్య.

అభ్యర్థుల ఎన్నికల ఖర్చులు ప్రభుత్వం భరించాలనే ప్రతిపక్షాల వాదన అర్థంలేనిది; దానివల్ల ఎన్నికలమీద ధనప్రభావం లేకుండాపోవడంవల్ల. ఎలక్షన్‌కమిషన్ విస్తరణనుగూర్చి ప్రతిపక్షాలు చేసినసూచన ఆమోదయోగ్యమైనది. నియోజకవర్గాల పునర్విభజన వాయిదా సమంజసంగాలేదు. గుర్తింపుకార్డులు అవసరమేకాని, ఎన్నికలసిబ్బందిలో నిజాయితీలేనపుడు అవి నిరర్థకమే అవుతాయి. లోక్‌సభ-శాసనసభలకు ఎన్నికలు వేర్వేరుగా జరగడమే మంచిది; జాతీయ సమస్యలతో స్థానికసమస్యలు ముడిపెట్టబడకూడదు. ఈ అంశాన్ని ప్రభుత్వం పరిశీలించవలసిన అవసరంలేదేమో ననిపిస్తుంది.

ప్రస్తుతం చేసిన ఎన్నికల సవరణ, సంస్కరణలు సద్వినియోగం కాగలిగితే సంతోషం!

---

## జమీన్‌రైతు

23-12-1938

20 పేజీలు అణా

### నెల్లూరు

(విమర్శకుడు)

నెల్లూరుజిల్లాబోర్డు వైస్ ప్రెసిడెంటు ఎలెక్షన్ 19 తేది జరిగింది. అనుకొన్నట్లే కాంగ్రెస్ అభ్యర్థి నల మోతు చెంచురామానాయుడుగార్ని ఎన్నుకొన్నారు.

ఇలా పోటీలేని విషయాల్లో మజా ఏముంది తిరుమల కొండారెడ్డిగారూ?

• • •

శ్రీ రామకోటి పీఠాధిపతులు శంకరాచార్య స్వాములవారు నెల్లూరు వేంచేసి నేటికి 55 దినాలు. దినానికి రూ 150 ల వంతున భక్తులు ఖర్చు చేసినడబ్బు రు 8250 లు.

ఈ పద్ధును జనరల్‌బాడీ ఎదుట పెడుతున్నాం దీన్ని సద్వినియోగం క్రింద ప్యాస్ చేయమని మా నోటు.

-Passed No Abjection.

• • •

టీ పార్టీలు:- బోర్డు అధ్యక్షునికి కుడిచేత్తో పెడుపుచేసిన పాల్గొంపావు గ్రామస్తులు ఎడమచేత్తో టీపార్టీ ఇచ్చారు. చిన్న పెద్దల బొడికట్టుంటాడు.

17 తేది కోవూరు తలిశ్యరాంవారుగూడ టీపార్టీ చేశారు. బోర్డువారు ఆ గ్రామస్తులకు చేసిన సహాయానికి ఇది కృతజ్ఞతాపూర్వక వందనము.

23 తేది అర్ధరు టీడర్లుగల అమలాడబాడుగూడ అతిథ్యమిస్తున్నారు. 3 తేది దర్శిలోనూడానట. ఇకరాలు; పది మాసాలకెందుకు యింకా ఖర్చు జెరతారు?

• • •

దామరమడుగు రైటింగులో ఒకరు

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

చచ్చారు. 59 మందిని అరెస్టుచేశారు. జెయిలు యివ్వలేదు.

• • •

19 తేది రాత్రి పాటూరులో ఒక మర్డరు జరిగిందట. కరపత్రాలు తీసి పోనని నెల్లూరు దాలంతి చేస్తున్నది.

### నెల్లూరు మున్సిపల్ మీటింగు

తే 17 ది జరిగిన మీటింగులో మొదట పొకలాలి నిర్మాణానికి సాను కూలి చూపిరి. వీటి టూరింగు సినిమాకు లైసెన్సు పొడుగించడం పక్క తీవ్ర చర్చకు గురియైంది. ఇరుపార్టీలు తీవ్రంగా పనిచేశాయి. కొందరు మెంబర్లు తమపార్టీకు వ్యతిరేకంగా ఓటిచ్చారు. పోటీగి తవలెనని శివరామయ్యగారు తెచ్చిన తీర్మానం ఓడిపోయింది. తరువాత ఫేర్మెను బ్రతిమలాడుకోగా ఒకనెల గడువుయిచ్చారు.

### టాకీ రీలు

(మా మద్రాసు విలేఖరి)

రైతుబిడ్డ: సారధి ఫిలిం కంపెనీవారు త్వరలో 'రైతుబిడ్డ' అనే చిత్రాన్ని షూట్ చేయబోతున్నారు. శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారు డైరెక్టు చేస్తారు.

డైరెక్షను మొదలైన విషయాలలో శ్రీ రామబ్రహ్మంగారు ఒకటి గమనించాలి. 'రైతుబిడ్డ' తీసేటప్పుడు జమీందారుల, జమీన్‌రైతుల సమస్యలుకూడా పరిష్కారం ఆ ఫిల్మ్‌లో చేస్తారని ప్రకటించారు.

నిజంగా సహజంగా కర్షకసోదరుల- వ్యవసాయ కార్మికుల కష్టాల్ని కళ్లకు సినిమాలాగ కట్టినట్లు చిత్రించగల కథకుడు కావాలి. అందుకు శ్రీ రామానాయుడుగారు జమీన్‌రైతు సంపాదకులు అన్నివిధాలా తగినవాడు.

---

## ప్రకృతిముందు మనిషి ఎప్పటికీ నిస్సహాయుడేనా?

సోవియట్ రిపబ్లిక్ ఆర్మేనియాలో జరిగిన భూకంపం గురించి చదువుతున్నప్పుడు, ఆ ఘోరవిపత్తులో ప్రాణాలు కోల్పోయినవారి హృదయ విదారకమైన హాహాకారాలు టీవీలోచూచినపుడు గుండెల్లో కలచివేసినట్లయింది. ప్రకృతిశక్తిముందు మనమేధస్సు ఏం పనికొస్తుందన్న చేదునిజం విశ్వరూపంలో దర్శనమిచ్చింది. దాదాపు లక్షమందిని పొట్టనపెట్టుకున్న ఇలాంటి భూకంపాలన్ని ముందుగా కనుగొనే సాధనాలను కనిపెట్టడం అత్యంతావశ్యకం. ఇది ప్రపంచ దేశాలన్నీ గుర్తించగలగాలి. ప్రమాదాల తీవ్రతను ముందు జాగ్రత్త చర్యలద్వారా కాస్తలో కాస్త తగ్గించడానికి కృషిచెయ్యాల్సిన అవసరముంది. ఆర్మేనియా ప్రజలకు ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాను.

నెల్లూరు —కె. వి. ఎల్. రావ్.

### సమయాన్ని పెంచండి

దూరదర్శనవారు శ్రీ రామానందసాగర్ ఉత్తరరామాయణం ప్రతిశుక్రవారం రాత్రి 9 గంటలకు ప్రసారం చేస్తున్నారు. ఈ కార్యక్రమాన్ని కేవలం 20 నిముషాల సేపే చూపిస్తున్నారు. 20 నిముషాల్లో ఏ మాత్రం కథనడుస్తుంది? 9 నుంచి 9-10 వరకు అంటే పదినిముషాలసేపు వ్యాపార ప్రకటనలకు స్థానం యిస్తున్నారు. ఇక పోతే 20 నిముషాలలో రామాయణం ప్రసారంచూసే ప్రేక్షకులకు నిరాశ కల్గుతుంది. ప్రతి శుక్రవారం 8 గంటలకు చిత్రహార్ వేస్తున్నారు. ఇక మీదట చిత్రహార్ నిలిపివేసి, 7-45నుండి 8 గంటలవరకు వ్యాపార ప్రకటనలు చూపించి 8 నుంచి 8-40 వరకు 40 నిముషాలపాటు ఉత్తరరామాయణం ప్రసారం చేస్తేబాగుంటుంది.

నార్తురాజుపాలెం —కె. సుషమ

### జనవాణి

### ఎయిడెడ్ టీచర్లకు కొత్తవేతనాలు ఇవ్వాలి

1986 జులైనుండి ప్రభుత్వోపాధ్యాయులు, పరిషత్ ఉపాధ్యాయులు, మున్సిపల్ ఉపాధ్యాయులు పి. ఆర్. సి స్కేళ్లు తీసుకుంటున్నారు. ప్రభుత్వం 1987 సెప్టెంబరు 5 తేది ఎయిడెడ్ ఉపాధ్యాయులకుకూడా వర్తింపజేస్తామని ప్రకటించింది. సంవత్సరం గడిచిపోతున్నా ఇంత వరకు అమలుపరచలేదు. నవంబరు 15 తేది లోగా ఎయిడెడ్ ఉపాధ్యాయులకు బకాయిలతోసహా యిస్తూ కొత్తస్కేల్సు అమలుజరుపుతామనిఎద్యుకేషనల్‌డైరెక్టర్‌గారు ప్రకటించియున్నారు. డిశంబరు నెలకూడా పూర్తికావస్తున్నది. బకాయిలు మాట ఎలావున్నా కొత్తవేతనం అయినా జనవరినెలనుంచి వచ్చేపర్యాట్లు చేయిండాలని ప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తున్నాను.

గూడూరు —ఒక ఉపాధ్యాయుడు

★

---

## •• ఉత్తర క్రియలు

మా తండ్రి

### చౌకచర్ల రమణారెడ్డిగారు

**15-12-1988** తేది గురువారం స్వర్గస్థులైనారు.

వారి ఉత్తరక్రియలు

**25-12-88** తేది ఆదివారం శిలా ప్రతిష్ఠ

**26-12-88** తేది సోమవారం శిలోద్వాసన

నెల్లూరు, రామలింగాపురం 16/2674 నంబరు ఇంట్లో జరుగును. కావున బంధుమిత్రులు తెలియగోరుచున్నాము.

సి.వి. కృష్ణారెడ్డి
టౌనుబస్ ఓనర్-నెల్లూరు.

అల్లుడు-కసిరెడ్డి జనార్దనరెడ్డి-రిటైర్డ్ సూపరింటెండింగ్ ఇంజనీర్

# అదాలత్‌లకు అందాలు ఆడంబరాలు అనవసరం!

నెల్లూరుజిల్లా లోక్ అదాలత్‌ను రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ యోగేశ్వరదయాళ్ 18 తేది ఆరంభం లాంఛనప్రాయంగా ప్రారంభించారు. లోక్ అదాలత్ ఫిబ్రవరి 19తేది నుండి పని చేయనున్నది; అయితే న్యాయమూర్తి దేశంమీదుగా దానికి అధికారముద్ర వేయించారు. దేశంలో ఇది 72 వ లోక్ అదాలత్ అట. పెద్దగా న్యాయపరమైన వాదోపవాదాలు అవసరంలేకుండా, న్యాయస్థానాలలోసంవత్సరాలతరబడి అపరిష్కృతంగావుండే కేసులను పరిష్కారానికి ఏర్పాటుచేసిన ప్రజాన్యాయస్థానం లోక్ అదాలత్. బార్ అసోసియేషన్, ఇతర న్యాయసహాయసంఘాలకేంద్రాల సంయుక్త ఆధ్వర్యంలో జిల్లాజడ్జి అధ్యక్షతన దీనిని నిర్వహిస్తారు. కోర్టు ప్రమాదాలలోతలెత్తే నష్టపరిహారం వివాదాల పరిష్కారానికి లోక్‌అదాలత్ ప్రధానంగా ఉపకరిస్తున్నది!

18 తేది మధ్యాహ్నం 12-30 గంటలకు టౌన్‌హాల్‌లో లోక్ అదాలత్ ప్రారంభోత్సవం జరిగింది. ఈ సభకు ఏర్పాట్లను చాలా భారీఎత్తున చేశారు. జిల్లా జడ్జి ఎస్. జయరామరెడ్డిగారు! టౌన్‌హాల్ వేదికను దాదాపు వివాహ వేదికంత అందంగా అలంకరించారు. న్యాయమూర్తులిద్దరినీ పూర్ణకుంభంతో మంగళ వాయిద్యాలతో స్వాగతించారు. చీటన్నిందినీ చూసిన ప్రధాన న్యాయమూర్తిగారు. లోక్ అదాలత్‌లకు ఇటువంటి ఆడంబరాలు, అలంకరణలు వుండకూడదని, నిరాడంబరత అవసరమని మెత్తగా మందలించారు.

సభకు న్యాయమూర్తి శ్రీ కె. జయచంద్రారెడ్డి అధ్యక్షించారు. యువన్యాయవాదులు, లా విద్యార్థులు పల్లెలలోని పేదలకు న్యాయసహాయం అందేందుకు కృషి చేయాలని కోరారాయన.

### సింహపురి

సాధారణ న్యాయానికి, నామాజిక న్యాయానికి వ్యత్యాసం వుందని, ప్రజలకు సామాజిక న్యాయం అందించే బాధ్యతను శాసనసభలు స్వీకరించాలని ఛీఫ్ జస్టిస్ విజ్ఞప్తి చేశారు. లోక్ అదాలత్‌లో న్యాయస్థానాలకు ప్రత్యామ్నాయాలేకాని, న్యాయస్థానాల ప్రతిపత్తిని అవి పొందలేవని, సమాజంలోని అట్టడుగు వర్గాల వారికి న్యాయమందించేందుకు ఇవి కృషి చేయాలని కోరారు.

జిల్లాజడ్జి శ్రీ ఎస్. జయరామరెడ్డి నెల్లూరు కోర్టు భవనాల దుస్థితిని వివరించారు. 1904 లో కట్టిన ఈ భవనాలు రిపేరుకు పనికిరావని ఇంజనీర్లు తెల్చిచెప్పేశారని, రాష్ట్రంలో ఇంతటి అధ్వాన్న భవనాలు ఇంకెక్కడాలేవని అన్నారాయన. కొత్తభవనాలకు 15 లక్షల నిధులు కావాలని కోరారు. గూడూరు సబ్ కోర్టులో అపరిష్కృతంగావున్న 700 తెలుగుగంగ భూసేకరణ కేసులను లోక్ అదాలత్‌కు మళ్ళించడానికి కలెక్టర్ సమ్మతించినా, ప్రభుత్వం నుంచి అనుమతిరాలేదని చెప్పారాయన. ఈ విషయమై శ్రీ పి సి రెడ్డి, శ్రీ నువ్వుల వెంకటరత్నంనాయుడులు ప్రధాన న్యాయమూర్తి జోక్యం కోరుతూ ఒక వినతిపత్రం సమర్పించారు.

జిల్లా లోక్‌అదాలత్ కన్వీనరు శ్రీ గునుపాటి ఆదిశేషారెడ్డి నివేదిక చదివారు. ఇప్పటివరకు 880 కేసులు పరిష్కరించి కోటి 21 లక్షల పరిహారం చెల్లించినట్లు తెల్పారాయన. శ్రీ ఎస్. వి. శర్మ చివర్న వందనాలు చెప్పారు.

లోక్ అదాలత్ ద్వారా 20 వేల పరిహారమందుకున్న ఒకరోడ్డు ప్రమాదబాధితుడ్ని ప్రధాన న్యాయమూర్తి పలకరించి ఇంత స్వల్ప గాయాలకు అంత పెద్ద మొత్తం పరిహారం ఇవ్వడంపట్ల అసంతృప్తిని వ్యక్తంచేశారు.

### రామిరెడ్డిగారి వర్ధంతి సభ

ఎందరో సాహిత్యకారులను నిశ్శబ్దంగా ప్రోత్సహించి, పోషించిన సాహిత్యపిపాసి, వదాన్యుడు స్వర్గీయ తిక్కవరపు రామిరెడ్డిని, నెల్లూరు 'సాహిత్య సదస్సు' 14 తేది జరిగినసభలో ఘనంగాసంస్మరించింది. దొడ్ల వద్మావతమ్మ మహిళా గ్రంధాలయంలో జరిగిన ఈ రామిరెడ్డిగారి 15వ వర్ధంతి సభను డాక్టర్ జెట్టి గోపాలరెడ్డి అధ్యక్షించారు.

వి ఆర్ కాలేజి తెలుగు లెక్చరర్ శ్రీ సురభినరసింహం నందితిమ్మన పారిజాతాపహరణం గురించి ప్రసంగించి రామిరెడ్డి స్మృత్యంకంగా ఇచ్చే సన్మానాన్ని స్వీకరించారు. ఈ సభలోనే సురభినరసింహంగారి 'భక్తిసౌరభం' గేయకావ్యాన్ని గోపాలరెడ్డిగారు ఆవిష్కరించారు. వర్ధమాన సమాజం కార్యదర్శి శ్రీ అగస్త్య రెడ్డి వెంకురెడ్డి ఆ కావ్యాన్ని సమీక్షించారు. శ్రీ పోయారి హనుమజ్జానకీ రామశర్మ రచయితను ఆశీర్వదించారు. సంస్కృత కళాశాల లెక్చరర్ శ్రీ పూర్ణానంద శాస్త్రి సంస్కృత శ్లోకాలతో అక్షంతలు చల్లారు. సురభివారు స్నేహితులు పలువురు ఆయన్ను పూలమాలలతో, కొత్త గుడ్డంతో సత్కరించారు.

సభను డాక్టర్ సి వి రామచంద్రరావు స్వాగతించారు; సాహిత్య సదస్సు అల్ ఇండియా నిర్వాహకుడు శ్రీ గోసుకొండ వెంకటసుబ్బయ్య వందనాలు చెప్పారు.

### సి.ఎ.యం. హైస్కూలు గోడ

సి. ఎ. యం. హైస్కూలు ప్రహరీ గోడ పడమటిభాగం సుమారు ముప్ఫైయి అడుగులు పడిపోయి దాదాపు పదిసంవత్సరాలు కావస్తూంది. ఇంతవరకు దీన్ని గురించి పట్టించుకున్నాధుడే కరువయ్యారు. ఈమధ్యకాలంలో ఇద్దరుముగ్గురు హెడ్మాస్టర్లు మారినా ఒక్కరికికూడా ఈ గోడకట్టించాలనే ఆలోచనే వచ్చినట్లులేదు.

—కొరవ 10 వ పేజీలో



## పద్యాలు-గేయాలు

### నా ఆస్తి

"రసిక్"

ప్రజానాయకులిప్పుడు తమ
ఆస్తి వివరాలన్నీ
ప్రకటిస్తుంటే ప్రజానీకం తెలుసుకొంటున్నది
ఓహో అనుకుంటున్నది.
ఎవరెవరికి ఏవి ఊళ్ళలో
ఎన్నెన్ని ఇళ్ళస్థలాలూ, ఇళ్ళూ,
ఎన్ని వ్యవసాయక్షేత్రాలూ,
వాణిజ్యసంస్థలూ గట్రా
ఉన్నాయో అలకించి సంతోషిస్తోంది ప్రజ.
నాయకుల మాసలోనే, కవిగా
నా ఆస్తి వివరాలు ప్రకటించుకుంటున్నాను
సావధానులై వినుడుగాక.
నా రచనలకే యే ఊళ్ళలో పఠితలున్నారో
ఆయా ఊళ్ళన్నీ నావే.
ఆ పఠితల హృదయాలే నా ఇళ్ళస్థలాలు.
ఆ హృదయాలనుండి పైకిలేచిన
భావోద్వేగాలే నా ఇళ్ళు.
ఆ పఠితల నయనసీమలే నా పొలాలు
నా రచనలు వాటిలో పారించే కన్నీరే
జీవనగంగ.
ఆ పఠితల మనస్సులే, సదా నేను
లావాదేవీ జరుపుతోన్న వాణిజ్యకేంద్రాలు.
ఆ కేంద్రాలు నానుండి
దిగుమతి చేసుకొంటాయి
ఆమందానందాన్ని.
బదులుగా నాకు సరఫరాజేస్తాయి
కృతజ్ఞతాంజలులను;
ఇంతకూ ఏనాడోతేల్చి చెప్పినాడు
కవి అద్రుడు
"ఏమనిషికైనా ఆస్తి ఏముంటుంది కనుక?
సంగీతంలో సప్తస్వరాలు
సాహిత్యంలో ఏభై రెండు అక్షరాలూతప్ప"

నిజమంటాను నేను
ప్రజ ఏమంటుందో మరి!

### బెనజీర్ భుట్టో

ఎల్. వి. రావు

భుట్టో వంశాంకురమా!
పాకిస్తాన్ మహిళారత్నమా
బెనజీర్ భుట్టో!
అభినందనలు
ఇవిగో అందుకో!
పిన్న వయసులో
ప్రధాన మంత్రిత్వం
ప్రపంచ చరిత్రలో
అపూర్వం!
అది నీజన్మసుకృతం
నియంతృత్వ చీకటి
జియాతో అంతరించింది
ప్రజాస్వామ్య వెలుగు
నీతో అవతరించింది!
నిఖిల జగమూ
పరవశించింది
ఇంటలో నీతండ్రి
ఆశీర్వదిస్తున్నారు!
దివిలో మరెందరో
అభినందిస్తున్నారు!
పదవి పూలపాన్పని
తలవకు!
అందులో ముళ్లున్నాయని
మరువకు!
పాతకక్షలు కట్టిపెట్టు
విశ్వశాంతికి
వరుంకట్టు!
భారత్‌తో చెలిమి
మరువకు సుమీ!

# కృష్ణాపట్నం రేవు- ఇప్పట్లో ఆశలులేవు!

నెల్లూరుజిల్లాలోని కృష్ణాపట్నం ఓడరేవు నిర్మాణానికి నిధులులేవని కేంద్రం తేల్చిచెప్పేసింది. శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి ప్రధానమంత్రికి ఇచ్చిన వినతిపత్రంపై వ్యవసాయమంత్రి భజన్‌లాల్ 8 వ ప్రణాళికలో దీనిని చేపట్టే అంశం పరిశీలిస్తామని అన్నారు. అంటే 1990 తర్వాత అన్నమాట.

రాష్ట్రప్రభుత్వం ఏ మాత్రం శ్రద్ధ తీసుకొని వుండినా ఈ రేవు నిర్మాణం ఎప్పుడో పూర్తయివుండాల్సింది!

చిత్తూరులో ఒక వ్యవసాయ కళాశాల, చింతలదీవిలో వెటర్నరీ కళాశాల నిర్మించాలన్న శ్రీనివాసులురెడ్డి ప్రతిపాదనను కూడా కేంద్రం సున్నితంగా త్రోసిపుచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం ఇప్పట్లో కొత్త కళాశాలలు పెట్టేందుకు తమవద్ద నిధులులేవని చెప్పడంవల్ల ఈ ప్రతిపాదనలు పరిశీలించలేమన్నారు వ్యవసాయ మంత్రి. ★

### శ్రీనివాసులు రెడ్డికి కేంద్ర సేద్యం మంత్రి జవాబు

నవలాకులతోట గ్రామపంచాయితీ

## టెండరు నోటీసు

నెల్లూరు మండలం, నవలాకులతోట గ్రామపంచాయితీకి 4' 40 వా. గ్రాంట్ల క్రింద ఏ.పి. ట్యాంకర్లైట్ ప్లాన్ కవర్ లోను, కండిక్కువ, స్టాఫులు, బోట్లు, 8/4 కి.మీ. పైపు 8/20 పైపులతో) 40 సెట్ల సప్లయి చేయుటకు గ్రాంట్ల క్రింద ఏ.పి. అప్రూవ్డ్ డీలర్ల వద్దనుండి 4.1.89 తేదీ మధ్యాహ్నం 12 గం॥ లోగా సీల్డుటెండర్లు కోరబడినవి. టెండరు ధరావత్తు రూ. 200/-లు చెల్లించి టెండరు ఫారం తీసుకొనవలయును. ఇతర వివరములకు ఆఫీసు పనివేళలలో తెలుసుకొనవచ్చును.

యం. డి. రెహమాన్
సర్పంచ్

# నెల్లూరు రాజకీయాల్లో
## విశ్లేషకుడు

### జనార్దనరెడ్డి మళ్ళీరాక

అనుకోకుండా ఒక్కవారంలోనే రెండు సార్లు జిల్లాకు వచ్చిపోయిన పి.సి.సి. అధ్యక్షుడు శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి జనవరి 6 తేదీ మరొకసారి పర్యటించబోతున్నారు. 6 తేదీ ఉదయం కోవూరు, సాయంత్రం కావలి; 7 తేదీ ఉదయం వింజమూరు, మధ్యాహ్నం ఉదయగిరి, సాయంత్రం సంచవరంమీదుగా ఆత్మకూరు వెళ్తారు.

### కలెక్టరు

ట్రెయినింగుకు పోయివుండిన కలెక్టరు శ్రీ కె. రాజు తిరిగివచ్చి 19 తేదీ చార్జి తీసుకున్నారు.

### శాసనసభ టిక్కెట్లకు తెలుగుదేశం జాబితా?

ఆలూచూలు లేకుండా కొడుక్కి పేరు పెట్టినట్లు తెలుగుదేశంపార్టీ జిల్లాలోని 11 నియోజకవర్గాలకూ అభ్యర్థుల జాబితాను రూపొందించినట్లు విశ్వసనీయంగా తెలిసింది. అది ఇదీ. సర్వేపల్లి- దేగా నారసింహారెడ్డి; ఆత్మకూరు- అల్లారెడ్డి కృష్ణారెడ్డి; రాపూరు- ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి; వెంకటగిరి- నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి; అల్లూరు- బొల్ల కుటుంబీకులలో ఒకరు; కోవూరు- సిపిఎం; కావలి- కొండపనాయుడు లేదా ప్రభాకర నాయుడు; ఉదయగిరి- విజయరామిరెడ్డి; నెల్లూరు- రమేష్‌రెడ్డి లేదా ఆయన సోదరి శ్రీమతి జయమ్మ. జిల్లా దేశంలోని కొందరు ముఖ్యులు ఈ జాబితాను రూపొందించి అధిష్ఠానవర్గానికి సమర్పించారట. ఇందులో అనంవారి పేరు ఒక్కటి లేకపోవడం గమనార్హం! అయితే ఈ జాబితాపై దాన్ని పంపినవారికే అసంతృప్తికలిగి, పేర్లుమార్చి ఇంకొకటి అందజేశారట. ఆ పేర్లేవో తెలియరాలేదు.

ఇంకొకపత్రిక గండిపేట ఆదేశానుసారం జిల్లాలోని అన్ని ప్రధాన గ్రామాలలో రాజకీయపరిస్థితి, గ్రామపెద్దలపై రహస్య నివేదికలు తయారౌతున్నాయి. ఏఏ గ్రామాలపై ఎవరెవరు నివేదికలు పంపవలసిందీ తెలుగు విజయమే నిర్ణయించిందట. ఇప్పటికిప్పుడు ఎన్నికలు పెడితే పరిస్థితి ఎట్లావుంటుంది అన్నది కూడా ఆ నివేదికలో ఒక అంశమట. మొత్తంమీద శాసనసభ ఎన్నికలకు తెలుగుదేశంపార్టీ ఇప్పటినుంచే సిద్ధమౌతున్నది!

జిల్లానాయకులు ఎన్ని జాబితాలు పంపినా ఈసారి ఎన్టీఆర్ అభిమానసంఘం సభ్యులు, రాజకీయాలలో ఒనమలు తెలియని కొత్తముఖాలకుతప్ప మరెవరికీ అవకాశం వుండదంటున్నారే-నిజమేనా?

### బ్యాంకుతీర్పు వాయిదా

నెల్లూరు కో ఆపరేటివ్ బ్యాంకు పాలకవర్గంపై హైకోర్టులో దాఖలైవున్న కేసు 27 తేదీకి వాయిదాపడింది. ఈనెల 8 తేదీ జరిగిన అవిశ్వాస తీర్మానం చట్టబద్ధమా, కాదా అనే అంశంపైన, అందులో ఓడింగు సరళిపైన చంద్రమోహనరెడ్డి ప్రారంభించిన న్యాయస్థాన పోరాటం ఇది. ఇప్పటికి అనేకసార్లు విచారణకువచ్చినా ఉభయపక్షాల న్యాయవాదుల అభ్యర్థనలమేరకు కేసు ఒకకొలిక్కి రాకుండా వాయిదా పడుతూనే వుంది.

కేసు అపరిష్కృతంగా వుండిపోవడంతో అనం వివేకానందరెడ్డి తమ డైరెక్టర్ల బ్యాంకును ఇంకా కొనసాగిస్తూనే వున్నట్లున్నారు. ఇంకొకప్రక్క చంద్రమోహనరెడ్డి డైరెక్టర్లను బుట్టలోవేసుకునే యత్నాలూ కొనసాగుతున్నాయి.

ఏడాదిన్నర కాలం వ్యవధికూడాలేని బ్యాంకు ఛైర్మెన్ పదవికోసం ఉభయులకు ఎందుకింత ఆరాటం, పోరాటం?

### ఆర్మేనియాకు లక్ష పంపుతారట!

సోవియట్ రష్యాకుచెందిన ఆర్మేనియా భూకంపబాధితులకు నెల్లూరు మునిసిపాలిటీ తరఫున లక్షరూపాయల విరాళం పంపాలని కౌన్సిల్ తీర్మానంచేసింది. మునిసిపల్ నిధులనుంచి పంపుతారట ఈ డబ్బును.

టౌనులో మురిదప్పంగావున్న కోర్ట మురికి మర్రికాల్వలకారనికే పనికి మునిసిపాలిటీకి గతిలేదే. ఆర్మేనియాకు లక్షరూపాయలు ఎక్కడనుండి తెచ్చిస్తారు? మానవతా దృక్పథంతో సహాయం చలపెట్టదలంచుకుంటేగాని ఆ భారాన్ని మునిసిపాలిటీమీద వేయకుండా, ఛైర్మెన్, కౌన్సిలర్లు కష్టపడి విరాళాలు పోగుచేసి పంపివుంటే అభినందనీయంగావుండేది.

### ప్రకటనల్లో ప్రదర్శన

నాదెళ్ల అంశులకు నిరసనగా జిల్లా అంతా నిరసన ప్రదర్శనలు జరిపినట్లు జిల్లా ప్రజాపరిషత్ ఛైర్మెన్ శ్రీ దేగా నారసింహారెడ్డి దినపత్రికలలో ప్రకటించేశారు. కానీ ఆయనిచ్చిన ప్రకటన కాగితంపై తప్ప మరెక్కడా ప్రదర్శన అన్నది జరగనేలేదు; జరపాలన్న ప్రయత్నమూ చేసినట్లులేదు. పత్రికలలో వార్తలు చదివి హైదరాబాదు నాయకులు ఆహా అని మెచ్చుకుంటారేమో తెలియదుగాని, అది చదివిన ఆయాగ్రామాల ప్రజలు మాత్రం నవ్వుకుంటున్నారు!

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | పుట్టి | 2850.00 |
| ఐ. ఆర్. 20 | | 2400.00 |
| సున్నాలు | | 2400.00 |
| మొలగొలుకులు బియ్యం (70కి) | | 850.00 |

### కొట్టు, ఇల్లు అమ్మబడును

నెల్లూరు చిన్నబజారు మంచి వ్యాపార కూడలిలో సాయిరాజ్ స్టోర్స్ ఎదురుగా పాత డోర్ నం. 18/888 సుమారు 16 అంకణముల స్థలంలో 9 అంకణముల కట్టుబడి గల షాపు రూము మిద్దెపై కాపురానికి పనికివచ్చు 7½ అంకణముల కట్టుబడిగల ఇల్లు పణతులవారి వీధిలో నికి ఇంటి వెనుక సందిదారి కావి కూడా ఉన్నది అమ్మబడును. వివరములకు అదే కొట్టునందు మజ్జిగ రంగారెడ్డి గారిని సంప్రదించండి. వెంటనే చేరవచ్చును.

### శ్రీ మల్లికార్జునస్వామి-శ్రీ కామాక్షితాయివార్ల దేవస్థానం

జన్నవాడ క్షేత్రము-నెల్లూరు జిల్లా.

### పట్టుచీరల వేలంపాట ప్రకటన

ఆర్.సి. నం. 840/88 తేది 17-12-1988

శ్రీ కామాక్షితాయి అమ్మవారికి భక్తులచే సమర్పింపబడిన పట్టుచీరలు ప్రతి శుక్రవారం మరియు పర్వదినములందు నూతన సంవత్సరం (1989) జనవరినెల నుండి సదరు దేవస్థానం ప్రాకార మంటపములో బహిరంగ వేలంపాటలో అమ్మబడునని యిందుమూలముగా తెలియజేయడమైనది.

కావున భక్తులెల్లరూ ఈ సదవకాశమును వినియోగించుకొని దేవస్థానమువారు జరుపబడే పాటలో విరివిగా పాల్గొని వారికి కావలసిన పట్టుచీరలు పాడుకొనవలసినదిగా కోరడమైనది.

యం. సుబ్బరామయ్య
కార్యనిర్వహణాధికారి

## ఆహ్వానము

నెహ్రూ శతజయంతి సందర్భంగా నెల్లూరు, దర్గామిట్ట శ్రీ వెంకటేశ్వర కస్తూరిబా కళాక్షేత్రమునందు 4-1-1989 తేది బుధవారం సాయంత్రం 5-30 గం॥కు ఈ క్రింది పెద్దలు జిల్లా సర్వోదయమండలి సౌజన్యంతో సన్మానించబడుదురు.

సభాధ్యక్షులు : శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు

సభాప్రారంభకులు : శ్రీ జక్కా వెంకట్రామరెడ్డి B. A., B. L., గారు

సన్మానితులు : శ్రీ రేబాల దశరథరామిరెడ్డి, మాజి అసెంబ్లీస్పీకర్, Ex. MP

శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, రైతునాయకులు, శ్రీ పర్వతరెడ్డి బాబుల్ రెడ్డి Ex MP రాష్ట్ర జనతాపార్టీ అధ్యక్షుడు, బిషప్ శ్రీ పి. సి. బాలస్వామి, శ్రీ చదలవాడ జయరామశాస్త్రి, శ్రీ యద్దనపల్లి గోవిందుశెట్టి, ఆం. ప్ర. సర్వోదయమండలి అధ్యక్షులు శ్రీ జి. మాణిక్యరావు, ఆం. ప్ర. భూదానయజ్ఞబోర్డు అధ్యక్షులు శ్రీ. సి. వి. చారి; తెలుగుగంగ ఛీఫ్ ఇంజనీర్ శ్రీ వి. నారాయణరాజుగారిని, నెల్లూరు జిల్లా రైతులు సన్మానము చేయుదురు.

ఈ సభలో కీర్తిశేషులు, రాజకీయ, సాంఘిక, ధార్మిక కార్యక్రమములతో సంబంధమున్న పెద్దల పేరుతో కవులను, సంఘసేవకులను, స్వాతంత్ర్య సమరయోధులను సన్మానించెదరు.

ఈ సన్మాన కార్యక్రమానంతరం:- లాస్యప్రియ సమర్పణ శ్రీమతి ఉమారామారావు శిష్యులు సింగారమణులు బిరుదాంకితులు, ప్రముఖ నర్తకీమణులు.

శ్రీమతి పుంజాల ఆలేఖ్య M. A., కుమారి వనజాలత M. A , కుమారి జ్యోతిర్మయి M. A గార్ల నృత్య కదంబమాల ప్రదర్శనకలదు.

సాంస్కృతిక కార్యక్రమసభాధ్యక్షులు :- శ్రీమతి కె. సుజాతారావుMSc. (కలెక్టర్ సతీమణి)

ప్రారంభకులు :- శ్రీమతి చివుకుల సహన M A.

సన్మానితుల బంధుమిత్రులు పై సభలో పాల్గొనవలసిందిగా కోరుచున్నాము.

ఎన్. బాలకృష్ణారెడ్డి, కన్వీనర్ మన్నెం శ్రీనివాసరెడ్డి, అధ్యక్షుడు

చివుకుల మాలకొండయ్య-BSc., BL కార్యదర్శి ఆహ్వానసంఘం దేవిరెడ్డి కోదండరామిరెడ్డి-ఉపాధ్యక్షుడు

గేటువద్ద పాస్ తీసుకొని లోనికి ప్రవేశించ ప్రార్థన.



'రాజకీయ చదరంగం'లో జమున

# సబ్సిడీలిస్తామంటూ రేగాని ఇచ్చినట్లు ఎక్కడా చెప్పరేమి?

"రాష్ట్ర ప్రభుత్వం సబ్సిడీలు, రాయితీలు ఇస్తుందని వినిపిస్తుంటేగాని, ఇస్తున్నారనిగాని, ఇచ్చారనిగాని ఎక్కడా విని పించదేం?" అని ఇటీవల ఒక నిర్మాత తన సందేహాన్ని వెలిబుచ్చారు. "అసలు బొక్కసంలోనే చిల్లిగవ్వ కరువైనప్పుడు ఏమిస్తారు బాబూ" అని మరో నిర్మాత చమత్కరించారు. అందుకే మద్రాసులో చిత్రాలు తీయడమే మేలు. అనే నిర్ణయానికి వస్తున్నారు చాలామంది నిర్మాతలు.

**త్రిపాత్రధారి బాలకృష్ణ**

ఎ. వి. ఎం. చెట్టియార్ బంగళాలో "ముద్దులమావయ్య" చిత్రం షూటింగ్ జరుగుతోంది. నిర్మాత ఎస్. గోపాల్‌రెడ్డి దగ్గరుండి ప్రతి చిన్న విషయాన్నీ స్వయంగా చూసుకుంటున్నారు. ఇటువంటి నిర్మాతలు చాలా అరుదు. ఆయనా, బాలకృష్ణ ఎంతో చనువుగా వుంటారు. "బ్రహ్మర్షి విశ్వామిత్ర చిత్రంలో నేను రాముడు, దుష్యంతుడు, హరిశ్చంద్రుడు — మూడు పాత్రలు ధరిస్తున్నాను" అన్నారు బాలకృష్ణ. ఇటుపైన ఆయన నటించే చిత్రాలలో తెలుగుదేశం పార్టీకి చెందిన డైలాగ్స్ ఉండవట. అసలు రాజకీయాల గొడవ బొత్తిగా ఉండకూడదని నిర్ణయించుకున్నారట. మంచిదే!

ఎ. వి. ఎం. గార్డెన్స్‌లో "ముద్దుల మామయ్య" చిత్రంకోసం "పుల్లామామిళ్ల కోకే. పిల్లావేవిళ్ళకొచ్చే. పళ్ళే చలివిళ్ళు పెట్టరే. మామయ్యఅన్న పిలుపు మాఇంట్లో ముద్దులకు పొద్దుపొడుపు" అనే పాటను సీత సీమంతం సందర్భంగా కోడి రామకృష్ణ చిత్రీకరించారు.

**సంక్రాంతికి చిత్రాలు**

జనవరిలో మూడు నాలుగు చిత్రాలు విడుదల కానున్నాయి. ఇందులో కృష్ణ చిత్రాలు రెండు, చిరంజీవిది 1, వెంకటేశ్‌ది ఒకటి విడుదలకు సిద్ధమవుతున్నాయి

## మద్రాసు సినిమా వార్తలు

కృష్ణ, జయప్రద, భానుమతి నటించిన "అత్తమెచ్చిన అల్లుడు" జనవరి 6న; కృష్ణ - అక్కినేని నాగేశ్వరరావు నటించిన "రాజకీయ చదరంగం" జనవరి 14న; చిరంజీవి నటించిన

— తరువాయి 10వ పేజీలో

# రచ్చగావుంది - రక్తాభిషేకం!

### చిత్ర సమీక్ష
గిద్దలూరు గోపాలరావు

యండమూరి వీరేంద్రనాథ్ వ్రాసిన ఈ చిత్రం చాలాకు కథ చాలా అధ్వాన్నంగావుంది. ఎందునాపసలేని ఈకథతో తయారైన చిత్రం తీరుతెన్నులు చౌకబారుగా వున్నాయి. ఈ పనికిమాలిన కథ ఆధారంగా సృష్టించిన దృశ్యాలూ చప్పగా వున్నాయి. వాస్తవికత పూర్తిగా లోపించింది. పోసీ, అవాస్తవికతనైనా ఒక అసాధారణమైన తోరణిలో "అబ్బా" అనిపించేట్టయినా చూపారా అంటే అదీ లేదు. కథ చిత్రాన్ని పూర్తిగా దెబ్బతీసింది. కేవలం ఫైట్లు, డ్యూయట్లు హరా విడిపోడ చిత్రం నిలుస్తుంది.

మన దర్శకులను నిర్మాతలను పట్టి పీడించే మూఢనమ్మకం ఇప్పటిదాకా వీరిని వదిలేట్టులేదు. ఈ మూఢనమ్మకం ఏదో కాదు. చిత్రం బాలాకు కథగాని ఇతర ముఖ్యవిషయాలుగాని ఎలావున్నా 'హీరో' పేరుమీద బజానా నింపుకోవచ్చున్నది వీరి నమ్మకం. ఈ అవివేకంమూలంగానే చిత్రానికి ప్రాణమైన కథకు, ఇతర సాంకేతిక విషయాలకు విలువలేకుండా పోతూవుంది.

హీరో పేడను ఆధారం చేసుకొని ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో తయారైన "రక్తాభిషేకం" చిత్రంలోనూ హీరో ఇమేజ్ పెంచే విషయంలో తప్ప మిగతా అన్నివిషయాల్లో పతనం కనిపిస్తున్నది. హీరో ఇమేజ్ పెంచేందుకు దర్శకుడు ఎంతో ప్రయత్నించాడు. ఫైటింగులు, డ్యూయట్లు దండిగా చూపాడు. విలన్లు ఎన్నిరూటాలు పేల్చినా, ఎన్ని బాంబులు వేసినా హీరోబొక్కామీద కొంచెం దుమ్ము కూడా పడదు. కాని హీరో డెయ్యివిసిరితే వందమంది వస్తాదులు నేలకూలుతారు. హీరో పేర్చే ప్రతిమాటా వేలముందిని హత మారుస్తుంది. హీరో ఇమేజ్ పెంచేందుకు సృష్టించే దృశ్యాలు ఆ హీరో అభిమాన వర్గానికితప్ప మరెవరికీ నచ్చవు. ఈ దృశ్యాలన్నీ నేలవిడిచి సాముచేసేవిగా వున్నాయి.

నరసింహం అనే నీతిమంతుడైన పోలీస్ కానిస్టేబుల్ (సోమయాజులు) కు ఇద్దరు కుమారులు. పెద్దకొడుకు భార్గవ (శరత్‌బాబు) నిజాయితీగల సర్కిల్ ఇన్‌స్పెక్టర్. చిన్నకొడుకు పార్థసారథి (బాలకృష్ణ) లోకోద్ధారకుడు. ఇతనే కథానాయకుడు.

తనతండ్రిని సన్మానిస్తున్న సమయంలో సారథి, మంచి ఆఫీసరైన డి ఐ జీ (జగ్గయ్య) మెడలో పూలమాలవేసి అతని పిస్టలుతోనే అతన్ని కాల్చి చంపటం దురదృష్టకరమైన విషయం. "బ్లాక్ టైగర్లు", చిటా ప్రసాద్ (రంగనాథ్), దీనానాథ్ (సత్యనారాయణ) అనబడే విలన్ల పన్నాగంలో భాగంగా సారథి, పిస్టల్లో వున్నవి తమ్మీబులెట్లుగా భావించి ఒక మంచి పోలీస్‌ఆఫీసర్‌ను హీరో చంపుతాడు. ఇలాంటి తిక్కవస్తాయి సంఘటన కల్పించిన మలుపుమీద చిత్రం ఎక్కువ భాగం నడిపించటం దర్శకుడి అవివేకం తప్ప వేరుకాదు.

సర్కిల్ ఇన్‌స్పెక్టర్ భార్గవ హత్యానేరంక్రింద అరెస్టుచేసేందుకు సారథిని వెంటాడటం, డి. ఐ. జి. కూతురు అపర్ణ (రాధ) తనప్రేమను ప్రక్కకునెట్టి సారథిని పోలీసులకు పట్టించేందుకు అతనివెంట బడటం, వీరిద్దరిని పట్టి చెట్టుకు కట్టేసి, సారథి ఫ్లాష్‌బ్యాక్‌లో కథని, డ్యూయట్లు, డాన్సులు, హాస్యం వగైరా వివరాలతో వివరించడం పరమ బోరుగావుంది. సారథి ఓ ఫనంతావిని జాలిపడ్డట్టు నటించిన భార్గవ కట్లువిప్పటం, అతను వెంటనే తనడ్యూటీని జ్ఞాపకంచేసుకొని సారథిపైకి పిస్టలు సంధించటం, సారథి పరుగెత్తటం, అతన్ని భార్గవ తరమడం, మరలా ఫైట్లు వగైరా ఇంకా బోరుకొడ్తుంది.

సారథిని పట్టుకునేందుకు అతని అన్న భార్గవ తమతండ్రి చనిపోయినట్టు పత్రికల్లో ప్రకటించటం, అంతటితో సరిపెట్టుకోక బ్రతికున్న ఆ మంచి తండ్రికి కర్మ క్రతువులు చెయ్యటం చాలా అసహ్యించుకోవలసిన విషయం.

ఈనాడు చాలామంది దర్శకుల గొప్పదనం వుందే ఫైట్లు, డ్యూయట్లు, శృంగారం ఆర్భాటంగా చూపడమే. ఇందులో ఆ అనవసర ఆర్భాటం అతిగా కనిపిస్తుంది. శృంగారానికి హీరోయిన్ రాధనే ఎక్కువగా వాడుకున్నాడు.

ఇలా, నీరసమైన కథతో, నిరర్థకమైన సన్నివేశాలతో చిత్రం నిస్సారంగా వుంది. హీరో పేరుమీద ఆధారపడ్డ చిత్రం కాబట్టి అభిమానులకు నచ్చవచ్చు.

బాలకృష్ణ నటన ఆహారం, మంచినటన

— తరువాయి 10వ పేజీలో

# ఎన్టీఆర్ సినిమా విశ్వామిత్రకు దాసరి టీవి విశ్వామిత్ర పోటీ?

ఆదివారం ఉదయం ద్వాపరయుగం (మహాభారతం), శుక్రవారం రాత్రి త్రేతాయుగం (ఉత్తరరామాయణం) చూసి తరించిపోతున్నారు ప్రజలు. అందుచేత, ఆ సమయాలలో థియేటర్‌కు వెళ్ళి సినిమాలు చూసేవారిసంఖ్య చాలాతగ్గింది. మూలిగే నక్కమీద తాటికాయపడ్డట్టు దాసరి నారాయణరావు "విశ్వామిత్ర" టి. వి. సీరియల్‌ను తీస్తున్నట్టు వెలువడినవార్త తెలుగుదేశంవారిని కలవరపెట్టింది; కలచివేసింది. దీనికి స్పందించిన పురపాలక మంత్రి బి. వి. మోహనరెడ్డి "ఇది కళాద్రోహం. విస్తృత ప్రచారం పొందిన ఎన్. టి. ఆర్. విశ్వామిత్ర నిర్మాణదశలో వుండగా దాసరి దానినే టి. వి. కోసం తీయడం కళారంగాన్నే అపవిత్రం చేయడంలాంటిది. సాటి కళాకారుడితే రాజకీయ కక్షలతో వైషమ్యాలను, వ్యక్తిగత కార్పణ్యాలను వెళ్ళగక్కడానికి రాజకీయ వ్యంగ్యచిత్రాలను తీయడమేకాక పోటీగా టి. వి. చిత్రం తీయడమా?" అని ఆడిపోసుకున్నాడట. కొంతకాలం క్రితం శివాజీగణేశన్ నటించిన "విశ్వామిత్ర" తమిళచిత్రాన్ని ఒక నిర్మాత తెలుగులోకి డబ్ చేసి, విడుదలచేశాడే. అప్పుడు నోరెత్తని ఈ మంత్రి ఇప్పుడు ఇంతగా విరుచుకపడటం దేనికో!

★

# • శ్రద్ధాంజలి •



మా తల్లి, మా అభివృద్ధికి కారకురాలు

# నాయుడు నాగభూషణమ్మగారు

మమ్ము దుఃఖసాగరమున ముంచి స్వర్గస్తురాలైనారు. వారి జ్ఞాపకాలు మేము మరువలేనివి. వారి ఆత్మ దైవసాన్నిధ్యంలో చిరశాంతి పొందవలెనని ప్రార్థిస్తూ, వారికి మా ప్రగాఢ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

**వారి కర్మక్రతువులు 23-12-88 తేది 24-12-88 తేది**

మాచర్లవారి పాళెంలోని మా స్వగృహమున జరుగును.
బంధుమిత్రులు తెలియగోరుతాము.

కుమారులు : వెంకటరమణా రెడ్డి, రాజగోపాల్ రెడ్డి, శ్రీనివాసులు రెడ్డి, మనోహర్ రెడ్డి, డాక్టర్ జనార్ధన రెడ్డి (USA), మధుసూదన రెడ్డి

కుమార్తెలు: పిడూరు సుజాత. నారపరెడ్డి అన్నపూర్ణ, వంగల్లు లత.

---

తల్లి : సోమవరపు ఆదెమ్మ

కోడళ్ళు : కృష్ణవేణమ్మ, అనసూయమ్మ, శకుంతల, విద్యావతి, అనూరాధ (USA) శశికళ

అల్లుళ్లు : పిడూరు కోటారెడ్డి, నారపరెడ్డి చంద్రశేఖరరెడ్డి, వంగల్లు శ్రీనివాసులురెడ్డి

మనుమలు : పద్మాకర్ రెడ్డి, రవికుమార్ రెడ్డి, ఆదిశేషా రెడ్డి, శరత్ చంద్రా రెడ్డి, మహేష్ రెడ్డి అభిషేక్

మనుమరాండ్రు : శైలజ, ప్రసన్న, ఉష, ప్రతిభ, శేషమ్మ, సురేఖ, షర్మిల, పద్మినిశిల్ప, కావ్య (USA), లక్ష్మిశ్వేత

మరియు మునిమనుమలు, మనుమరాండ్రు

# జిల్లావార్తలు

(5వ పేజి కొరవ)

పరిచయపత్రాల పర్మిసుగల గుమాస్తాలను నేరుగా 'లా' పరీక్షలు రాయడానికి వీలు కల్పించాలనేది వీరి కోర్కెలు. వంద మంది గుమాస్తాలు నల్లబాడ్జీలు ధరించి ఉద్యోగాలు కోర్టు కు హాజరుకాకుండా సమ్మె చేశారు.

## దారిదోపిడి

కోవూరుకు సమీప ప్రాంతమైన గుమ్మళ్ళదిబ్బ గ్రామంలో 17తేది రాత్రి 8 గంటల ప్రాంతంలో బోడదిప్ప డింక్ అంజనేయులు అనేవ్యక్తి సైకిల్ మీద కోవూరుకు తిరిగివస్తుండగా-ఇద్దరు దుండగులు అడ్డగించి, అతనివద్ద నున్న రెండువేల అయిదువందల రూపాయలను పెరుక్కొని పరారయ్యారట. ఇటీవల పల్లె ప్రాంతాల్లో దొంగతనాలు, దారిదోపిడీలు ఎక్కువయ్యాయి. వీటిగురించి పోలీసుశాఖ పట్టించుకోవడంలేదు. అందువల్లే ఈ దొంగతనాల బెడద ఎక్కువవుతున్నది. ఈ విషయంలో పోలీసుశాఖ అప్రమత్తంగా వ్యవహరించడం అవసరం.

## కావలికి రానున్న అపోలో ఆరోగ్య బీమాశాఖ

మద్రాసు అపోలో హాస్పిటల్‌కుచెందిన ఆరోగ్య బీమాశాఖ కావలి జవహర్‌భారతి ఉద్యోగ సంఘసభ్యులకు అపోలో హాస్పిటల్‌కు చెందిన వివిధ ఆరోగ్య బీమాపథకాలను వ్యక్తిగత, గ్రూపు పద్ధతులలో అవలంబించేందుకు అంగీకరించారని కావలి జవహర్‌భారతి టీచర్స్ అసోసియేషన్ కార్యదర్శి శ్రీ కె. నాగరాజారావు తెలియజేస్తున్నారు.

## కోవూరు ఎస్. బి. ఐ వార్షికోత్సవం

కోవూరు స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఎ. డి. బి.) వార్షిక సాంస్కృతికోత్సవ కార్యక్రమం 17 తేది బ్యాంకి ప్రాంగణంలో ఘనంగా జరిగింది. ఆఫీసర్స్ అసోసియేషన్ జోనల్ కార్యదర్శి శ్రీ సి. భాస్కర రెడ్డి అధ్యక్షించారు. కోవూరు ప్రిన్సిపల్ డిస్ట్రిక్టు మున్సిఫ్ శ్రీ మహమ్మద్ జి. యస్. బాషా ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. బ్రాంచి మేనేజరు శ్రీ ఆర్. గోవిందరావు, బ్రాంచి ఎల్.ఐ.సి. కార్యదర్శి శ్రీ వై. శ్యాంప్రసాదరెడ్డి, శ్రీ బదరీ నారాయణ తదితరులు ప్రసంగించారు. శ్రీ కె.వి. నాగరాజకుమార్, శ్రీ వి. విష్ణుమోహన్ నటించిన 'డెంటిస్ట్' హాస్యనాటిక కడుపుబ్బ నవ్వించింది. శ్రీ నాగరాజకుమార్ వందన సమర్పణతో ఈ కార్యక్రమం ముగిసింది.

## ముత్తుకూరు మండల ఉపాధ్యాయుల సమావేశం

ముత్తుకూరు మండలం ఉపాధ్యాయుల కో-ఆర్డినేషన్ సమావేశం 7 తేది ప్రజాపరిషత్ కార్యాలయంలో శ్రీ వేమారెడ్డి వెంకటకృష్ణారెడ్డి అధ్యక్షతన జరిగింది. ముత్తుకూరుమండలంలోని ఉపాధ్యాయులకు సీనియారిటీలిస్టును త్వరగా తయారుచేయడం, ఇంక్రిమెంట్ ప్రీపోన్‌మెంట్ చేయడం తదితర పలు సమస్యలపై త్వరితగతిలో పరిష్కరించేందుకై నిర్ణయాలు తీసుకున్నామని ఎ.పి.టి.ఎఫ్. ముత్తుకూరు మండలశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ యస్. టి. లోకసింగ్ తెలియజేస్తున్నారు.

## ఘరానా మోసం

కోవూర్లో ఇటీవల గోపాల్, శరభయ్య అనే ఇద్దరు వ్యక్తులు బంగారు కుదువ వ్యాపారస్తుడైన హరిశ్చంద్రజైన్ వద్ద బంగారు పూతపూసిన రెండున్నరసవరల నకిలీగాజును బంగారుగాజుగా నమ్మించి, మూడువేలరూపాయలకు కుదువ పెట్టి సొమ్ము తీసుకెళ్ళారట. తర్వాత ఆ నగమీద అనుమానంకల్గిన ఆ కుదువ వ్యాపారి దాన్ని పరీక్షించగా, అది బంగారు పూతవేసిన గిల్టుగాజుగా తేలిందట. దానితో ఆ కుదువవ్యాపారి గుండెలు బాదుకుంటూ పోలీసులకు ఫిర్యాదు చేశాడట. ★

## పెండ్లిండ్లు

(5వ పేజి కొరవ)

పెద్దబ్బాయి, చిల్లమత్తూరు సర్‌పంచ్ దయాకరరెడ్డి, పెద్దమ్మాయి శైలజ ఒక జంటకాగా; రెండవ అబ్బాయి కరుణాకర రెడ్డి, రెండవ అమ్మాయి రాణి రెండవ జంట.

అశేష బంధుమిత్ర రాజకీయ సంబంధాలు కల్గిన సిసిఆర్ పెళ్ళిళ్ళకు అతిథులు రాలేదు, పిసిసి అధ్యక్షుడు శ్రీ జనార్దనరెడ్డి అనివార్యమైన ఈ వివాహాల హాజరు కోసంగా కార్యక్రమం వేసుకొని రెండు రోజులపాటు జిల్లాలోకూడా పర్యటించి మొహతెత్తించిపోయారు!

## పట్టయ్య కుమారుడు

అంతస్తు పెరిగినా, మాప్పరాని మనిషి; పూర్తిపేరు కుందా పట్టాభిరామరెడ్డి అయినా ఎల్లంటి పట్టయ్యగానే పరిచితుడు; ప్రదేశం నెల్లూరే అయినా పెద్ద పట్నంలో స్వంత పునాదులే వేసుకున్న అన్నస్థలాన్ని మరచిపోని వ్యక్తి; అజాత బడా కాంట్రాక్టరు అయిన పట్టాభిరామరెడ్డిగారి కుమారుడు విజయకుమార్; శ్రీ నిడమసిరి రామసుబ్బారెడ్డి కుమార్తె, ఊటుకూరు - నిడమసిరి రమణారెడ్డిగారి మనుమరాలు సమత కళ్యాణం 14 తేది నెల్లూరు జి. టి. టి. లో వైభవోపేతంగా జరిగింది.

## బెంగుళూరు పెండ్లి

స్వర్ణరాజకీయ నాయకుడు ఇద్దరు గోత్రీకుడు, పారిశ్రామికుడు, మనిషి ఎంత పొడవలో అంత విశాల హృదయుడు, నాయ బుద్ధివంత సంస్కార సౌజన్యశీలి శ్రీ ఏనుగ సీతారామరెడ్డి (మద్రాసు ఇండస్ట్రియల్ కెమికల్ ఏజన్సీస్) పుత్రుడు అనిల్ కుమారరెడ్డి; కొడగు-శ్రీ మోహన్‌దాసప్ప పుత్రిక అంజలి వివాహం 18 తేది బెంగుళూరులోని బెంగుళూరుప్యాలెస్‌లో జరిగింది.

## విద్యుత్ వివాహాలు

ఎలక్ట్రిసిటీబోర్డు సభ్యుడుగా వున్న నెల్లూరీయుడైన హైదరాబాదువాసి శ్రీ కె. బలరామరెడ్డి తనయుడు శ్రీనివాసరెడ్డి; బెంగుళూరు హెచ్.ఎ.ఎల్. రిటైర్డ్ జనరల్ మేనేజరు శ్రీ ఎజా. రామసుబ్బారెడ్డి తనయ సరళ వివాహం 14 తేది బెంగుళూరు ఉడ్‌లాండ్స్ హోటల్ లో జరిగింది.

• • •

నెల్లూరీయుడు కాకపోయినా, ఆత్మబంధు సమానుడైన విద్యుచ్ఛక్తిశాఖ ఛీఫ్ ఇంజనీరుగా, బోర్డు సభ్యుడుగా రిటైరైన 'మృదుభాషి', విద్యావేత్త శ్రీ వి. వి. రెడ్డి కుమారుడు నాగభూషణ్; మహబూబ్ నగర్ జిల్లా అర్మహూరువాసి శ్రీ వి. రంగారెడ్డి కుమార్తె అనిత పరిణయం కర్నూలు ఉడ్‌ల్యాండ్ హోటల్‌లో 16 తేది జరిగింది.

## పాకాల పాణిగ్రహణం

ప్రకాశంజిల్లా పాకాల పట్టభద్రుడు శ్రీ పూనూరు వెంకారెడ్డి కుమారుడు, హైదరాబాదు బి. హెచ్. ఇ. ఎల్. ఇంజనీరు జగదీశ్వరరెడ్డి బి. టెక్; దామరమడుగు - శ్రీ పూండ్ల భాస్కర రెడ్డి కుమార్తె సుధ పాణిగ్రహణం గత 19 తేది హైదరాబాదు మాసబ్‌టాంక్ రాజా మాన్షన్‌లో జరిగింది.

## 'బాల'ల వివాహం

నెల్లూరు. పి. ఎస్. జి. జ్యూయలర్స్ యజమాని, సర్వోదయ కాలేజి యాజమాన్యంమీద అలుపులేని పోరాటం జరిపిన పీసరు శ్రీ .పి సుబ్రహ్మణ్యగుప్త కుమార్తె బాలసులోచన; వస్త్ర వ్యాపార ప్రముఖులు రాయవరపు శంకరయ్య అండ్ సన్స్ స్వంతదారు శ్రీ బదరీనారాయణ కుమారుడు బాలగోపాల్ వివాహం గత 19 తేది శ్రీ పాండురంగ అన్నదాన సమాజంలో జరిగింది.

## 'దర్శి' పరిణయం

మద్రాసుకు మారి వ్యాపార రంగంలో బహుముఖంగా అభివృద్ధి చెందిన నెల్లూరీయుడు శ్రీదర్శి చెంచయ్యతనయుడు సత్యనారాయణ; విజయవాడ-శ్రీ కాకాని రామకృష్ణగారి తనయ వెంకటనాగలక్ష్మి పరిణయంవిజయవాడ టి.టి.డి లో గత 20తేది ఆయావహంగా జరిగింది. ★

---

**J.L. నారాయణ & న్యూ కంపెనీ Phone : 6729 నెల్లూరు-1**

# హనుమగిరి కాలనీలో

**వాయిదాల పద్ధతిలో ప్లాటు పొందండి.**

నెల్లూరు మద్రాసు జి. యస్. టి. రోడ్డుపై, బాలాజీ స్టీలుఫ్యాక్టరీ, పవన్‌కాలనీ, కోరా రెసిడెన్షియల్ కాలేజీలకు ప్రక్కన మా హనుమగిరి కాలనీ ప్లాట్లు కలవు.

వాయిదాల పద్ధతిలో ప్రతినెల లక్కీ "డ్రా"

నెల 1 కి రు. 500/- లు చొప్పున 60 నెలలు చెల్లించవలెను.

డ్రా లో గెలుపొందినవారు తదుపరి వాయిదాలు చెల్లించనవసరంలేదు.

**14-1-89 తేది 'సంక్రాంతి'**

రోజున మొదటి డ్రా జరుగును

రు. 500/- లు చెల్లించి ప్లాటు రిజర్వు చేసుకోవచ్చును.

## హిమగిరి కాలనీలో

నెల్లూరు, మద్రాసు జి. యస్. టి. రోడ్డుపై అప్పయ్యగేటువద్ద మా హిమగిరి కాలనీ ప్లాట్లు వేయబడి యున్నవి.

ప్లాటు ఖరీదు రు. 2500/- లు; 60' × 40'-2400 చదరపు అడుగులు దఫాల వారిగా రు. 200/-లు చొప్పున 15 నెలలు చెల్లించి ప్లాటు పొందవచ్చును.

— వివరములకు —

ప్రమోటర్స్ ఫోన్ : 6729

**J L నారాయణ & న్యూ కంపెని**

ఊర్వశి కాంప్లెక్స్, కాపువీధి - నెల్లూరు-524 001

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, Nellore - 524 001